# శ్రీరామావతారతత్త్వము

## ద్వితీయప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మవిరచితము.



చెన్నపురి:

"వావిళ్ల" ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1932.

# ధన్యవాదము.

మహాత్ములారా! సకాలమున శ్రీరామావతారతత్త్వము రెండవ సంపుటము తమకర్పించుభాగ్యము గలిగెనని విన్నవించుచున్నవాఁడను. మహాశయులప్రోత్సాహము భగవంతు ననుగ్రహమును రవంత కలిగెనని విశ్వసించువాఁడను. పోషకులపట్టిక కనిన నియ్యది తేటపడును. ఈ నాప్రయత్నమునకు నీసహాయము చాలదు. బాలకాండము రెండుప్రకరణములైనది. దీనింబట్టి యూహింపఁగాఁ బది పండ్రెండుప్రకరణములగునని తోఁచెడిని. ఈశ్వరానుగ్రహమున్నఁగాని యీ కార్యము నెఱవేఱదు. ధనసహాయము ప్రధానమనుట నేఁ జెప్ప నక్కఱలేకయే తేటపడును కావున భక్తులందఱు నా యీ యుద్యమమునకుఁ దోడ్పడుదురు గాక.

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం,
అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి."

అన్నప్రాక్తనసూక్తినే నమ్మినాఁడను. నాయెఱింగినవారినిగూడఁ బోషకులుగ నుండుఁడని ప్రార్థింపలేదు. పూర్వకాలమునందు బలె నిక్కాలమునను వేషధారులు గలరు. ఎన్నియో పేరుల ధనము నార్జింతురు. కావున బ్రహ్మపురాణము ముద్రించు నపుడు తాటిపత్రిప్రాంతముల నుండుకొందఱు పుస్తకముల పేరుచెప్పి ధనముతీసికొనిపోయి మరల బుస్తకముల మాకు

వారుపంప లేదని ప్రస్తావించిరి. వారిమాటలు సత్యము లే. అట్టి వారు గలరనుట యథార్థము. కావున నీపనినిఁ గొంత సాగించి యవకాశము దొరకిన నించుక ప్రయత్నింప నెంచితిని. పరమే శ్వరానుగ్రహ మెట్టులున్న నట్టులు పనిసాగును.

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్."

అన్న శ్రీకృష్ణపరమాత్మోపదేశము స్మరించుచు యథాశక్తి గ్గఁ బనిని సాగించుచున్నాఁడను.

ఒక్కపనిచేయఁ బ్రయత్నించి కొందఱు భాగహర్తల నియమించుకొని యాపని మిగుల సత్కార్యమని పొగడుచు నొకరితో నొకరికి సంబంధము లేనియట్లు నటించుచు నందందుఁ దిరుగుచుఁ బరస్పరము వినుతించుకొనుచు మొదలిడినపని చేయ కయున్నను జేసినయట్లు నటించుచు నించుకపని నపుడపుడు సాగించుచు మితిమీఱినవ్యయము కనఁబఱచుచు నుపన్య సించుచుఁ బామరుల నుద్ధరించుపాంకెఁ బాటుపడునట్లు తెలు పుచు ధనమును బంచుకొనుచుండువారు కొందఱు కలరనుట స్పష్టమేకదా! సర్వస్వము భగవత్కార్యమునకు వెచ్చించి సర్వదా సర్వేశ్వ రారాధనము చేయువారును గలరనుట సత్యము. కాని వీరిసంఖ్య చాలతక్కువ. వీరిం బొగడువారు విశేషించి యుండరు. సాధువులుమాత్రమే మనస్సుల నానం దించి యభినందింతురు. ఇట్టులున్న కాలమున ధన మార్జించు టకు వనేకోపాయములు పన్నవలయును. వెక్కండ్రు భాగ

ష్ఠ్వాములఁ గూర్పవలయును. ఈ నా ప్రయత్నమున నట్టివారు కూడుదురా యన్న ప్రశ్నమునకు సమాధానము సజ్జనులే చెప్పఁదగినవారు.

దేవతాసమత్వమును దేటపఱచిన ద్వేషించువారు పెక్కురుందురు. శివునకంటె విష్ణు వధికుఁడని గాని, విష్ణువునకంటె శివుఁ డుత్కృష్టుఁడని కాని వీరికంటె నింకొక్కఁ డుత్తమోత్తముఁడని కాని పలికిన నొ ననువా రనేకు లుందురు. జూదము మంచిదె కాదన నంగీకరించువారు లేరన రాదు. కాని మంచిదను వారే యధికసంఖ్యాకు లుందురు. కావున నికాలమున వేషధారులు మిక్కిలి కనంబడుచున్నవారు. అందఱును భగవత్కైంకర్యము చేయువారే. అందఱును సమలోష్టాశ్మ కాంచనులే. వీరిలో నుత్తమమధ్యమాధమనిర్ణయను ప్రజాసముదాయముపై నాధారపడియుండును. ఆనిర్ణయము చిరకాలమునకుఁగాని సాధ్యము కాదు. ఈలోపల నెవ్వరిభాగము వారికిఁ జేరును అవ్వల నేమైననేమి? వారు కృతకృత్యులేకదా. ఇవన్నియు నాలోచించి నన్నెఱింగినవారును, పుస్తకమును దిలకించి పఠించి యేమే నిందు సద్విషయ మున్నదా యని పరికించి కలదని విశ్వసింతురే నట్టివారును దీనికిం దోడ్పడుదురుగాక యని నమ్మి యీప్రయత్నమును సాగింప నెంచినాఁడను.

నేను శ్రీమద్రామాయణము నాంధ్రీకరించినపిదప, కొందఱు పూర్వరామాయణములతో నాపాత్తమున నందందుఁ గలభాగములను బోల్చి కొన్నిప్రశ్నములు వ్రాసి నాకు బఱు

లిమ్మని పంపిరి. ఆప్రశ్నములకుఁ గొన్నింటికిం బదులీయ నేల
యని యూరకుంటిని. కొన్నింటికి నీశ్రీరామావతారతత్త్వ
మున నాయాయితావుల బదులు వ్రాయుచున్నాఁడను. కావు
న నే యిందు నితరుల రామాయణములఁ బేర్కొనవలసెను. లేక
యున్న నాకక్కఱలేకయే యుండును. వారిపేరులు వ్రాయఁ
దలంచి వారియనుమతి వేఁడితిని. కొంద ఱంగీకరించితిమని వ్రాసి
నారు. మఱికొందఱు మౌనముద్రలం దాల్చిరి. అందుఁ గొంద
ఱడిగిన ప్రశ్నములు సపక్షపాతములుగఁ దోఁచినవి. పక్షపాత
మూనరాదనియే యందందు వ్రాయుచున్నాఁడను. గ్రంథకర్త
లీవిషయమునఁ గినియరాదు. వారిగ్రంథముల విమర్శించుపని
నాకు లేదు. ఆయూహకలవాఁడనుగాను. నాపుస్తకమును విమ
ర్శించినను న్యాయమున్న గ్రహింతును. లేదే నూరకయుందును.
వారిసవరణలు మంచివైన వానిని ద్వితీయముద్రణమునఁ
జేర్తును. వారినిగూడ నందు స్మరింతును. కేవల ద్వేషభావ
మున విమర్శించినవారిని స్మరింపను. తిట్టిరేని బదులు తిట్టను.
ఇదియ నాయాశయము. దురభిమానము స్వలాభము నశింపఁ
జేయుననియు నది సాధులక్షణము కాదనియు నాయూహ. పర
దూషణమే యుత్తమకార్యమని భావించువారలకు బదులు
చెప్పకుంటయే మంచిదని తలంచువాఁడను. "మౌనేన కలహో
నాస్తి" అన్న సూక్తి క్రొత్తది కాదుకదా. సమాధానము చెప్ప
కయున్నంతమాత్రమున నశక్తుఁడనని నన్నందురేని యదియు
నాకు లాభమే. గుణగ్రహణపారీణు లుండకపోరు. ప్రమాదము

ల్లరకుం గలుగు. వాని నీలోపలనే ద్వితీయముద్రణము సాగునుగాన నపుడు సవరించుకొందును.

మహాశయులారా! నా యీభావము మీవంటివారికి సమ్మతమైనంజాలు. ఎల్లరను మెప్పింప బ్రహ్మకేఁ దరంబు గాదన నామాట యిటనేటికి?

"యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ."

అని మహాకవి భవభూతియు,

తే. "జడమతులచేత నిందింపఁబడినకృతుల
నుత్తమము లంచు సత్కవు లొప్పుకొంద్రు
శునకదంష్ట్రల రాచిన వెనుకఁ గాదె
పసిఁడిసొమ్ములఁ దాల్తురు ప్రభువు లెల్ల."

అని కోటి వెంకనార్యుఁడును

"నిందతు నందతు వాసన్నసూయం రసనూయం ర్తత్ర కిం తేన,
యత్నస్నానసగమసా హైమ వేదం మమ తు పాథేయమ్."

అని రామకవియుఁ దెలిపిరి కదా. అట్టిమహనీయులపాదధూళిని దలఁదాల్చి

"శిర సైక మవాప్య యద్రజో మనసాఽవ్యత్పరివర్జతే చ యైః."

అన్నయట్లు పెద్దలయాశీర్వాదమే పరమార్థముని భావించుచు దానినే కోరుచు నాకెల్లభంగులఁ దోడ్పడుచున్న సంస్కృ

తాంధ్రభాషోద్ధారకులు సహజధార్మికులునగు మ. రా. శ్రీ
వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికిఁ గృతజ్ఞుఁడనై పరమేశ్వరాను
గ్రహమునుగోరి యీకార్యము సాగించుచున్నవాఁడనని విన్న
వించుచున్నాఁడను. అందందు నావ్రాసినసిద్ధాంతములు సర్వ
సమ్మతములా యని ప్రశ్నించినవారలకు నట్టి సర్వసమ్మతసిద్ధాంత
ములే లేవని విన్నవించువాఁడను. అల్పజ్ఞుఁడనగు నాలోపముల
మన్నింపఁ బండితాఖండలులఁ బ్రార్థించువాఁడను.

ఇట్లు విన్నవించు సాధుపాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః.

# ఉద్ధారకులు

ఆనరబుల్ దివాన్‌బహదూర్ బి. మునుస్వామినాయడుగారు,
బి. ఏ. బి. యల్., ప్రధానమంత్రిగారు, మదరాసు.

మ-రా-శ్రీ మడిపల్లి సూర్యనారాయణమూర్తిగారు, ఆరవిల్లి, ప॥ గోదావరి.
,, అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు, బళ్లారి.

# పోషకులు.

మ-రా-శ్రీ అక్కెనప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., బి. ఇ.,
ఇంజనీయర్ గారు, గుంటూరు.

,, ఏ. టి. వి. ఆర్. నరసింహస్వామిగారు, ఉపాధ్యాయులు,
దోన్మేరు.

,, పైండా రామకృష్ణయ్యగారు, జమీందారులు, కాకినాడ.

,, దేచిరాజు రామరావుగారు, గుంటూరు

,, నోరి శ్రీరామమూర్తిగారు, ఉపాధ్యాయులు, దోన్మేరు.

,, సుంకర సుబ్బయ్యగారు, ఉపాధ్యాయులు, దోన్మేరు.

,, కలగ నరసింహముగారు, ఉపాధ్యాయులు, కొవ్వూరు.

,, నరసింహదేవర వేంకటశాస్త్రిగారు, ఉపాధ్యాయులు, దోన్మేరు.

,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, బళ్లారి.

,, రావుసాహెబు జే. పాపయ్యశ్రేష్ఠిగారు, బళ్లారి.

శ్రీమతి వై. ఛాయాంబగారు, బళ్లారి.

మ-రా-శ్రీ నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., వకీలు, గుత్తి.

,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు, గుత్తి.

మ-రా-శ్రీ ఎస్. సుబ్బారావుగారు, బి. ఏ., ప్లీడరు, గుత్తి.

,, ఏ. కోనేశాచార్యులుగారు, బి. ఇ. డి., ఉపాధ్యాయులు, గుత్తి.

,, ఉప్పరపల్లి రంగాచార్యులుగారు, తెలుగుపండితులు, గుత్తి.

,, వై. గొందల్ రావుగారు, ఉపాధ్యాయులు, గుత్తి.

,, ఆర్కాటు, వెంకోబరావుగారు, పెన్షనర్, గుత్తి.

,, కే. వేంకటరావుగారు, అనుంపల్లె.

,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

,, రాచర్ల తిప్పయ్యగారు, బెళుగుప్ప.

,, జం లక్ష్మీనరసింహశాస్త్రులుగారు, ఉపాధ్యాయులు, కడప.

,, కాట్రపాటి చలపతిరావుగారు, ఒంటిమిట్ట.

,, యావాళ్ల సుబ్బయ్యశ్రేష్ఠిగారు, పెనుసుపల్లి.

,, జేవకొండ వేంకటసుబ్రహ్మణ్యముగారు, ఉపాధ్యాయులు, పాటూరు.

,, పుట్టంరెడ్డి చలమారెడ్డిగారు, మండపంపల్లె.

,, ఆకేపాటి తిరుపలరెడ్డిగారు, తాలూకాబోర్డుమెంబరు, గ్రామ మునిసిఫ్, ఆకేపాడు.

,, పులిగండ్ల చెంగయ్యగారు, నాజరు, నెందలూరు.

,, అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు, బి.ఏ.,ఎల్.టి., హెడ్మాష్టరు, వి. ఆర్. హైస్కూలు, వేంకటగిరి.

,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.

,, దరిమడుగు చలమయ్యశెట్టిగారు, కుల్లూరు.

,, కే. జోగయ్యగారు, మదరాసు.

---

# విషయసూచిక.

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము.

## ద్వితీయప్రకరణము.

---

### భగవద్ధ్యానము.

శ్లో. శ్రీరామం బలవైరినీలచికురం స్మేరాననం శ్యామలం
కర్ణాంతాయతలోచనం సురవరం కారుణ్యపాథోనిధిమ్,
శోణాంభోరుహపాదపల్లవయుగం శ్రోణీతనూజాయుతం
రాజత్కుండలగండభాగయుగళం రామం సదాఽహం భజే. ౧

శ్రీరామం జగదేకవీరమమలం సీతామనోరంజనం
కౌసల్యావరనందనం రఘుపతిం కాకుత్స్థవంశోద్భవం,
లోకానామభిరామమంగళఘనవ్యాపారపారాయణం
వందేఽహం జనఘోరపాపనికరధ్వంసం విభుం రాఘవమ్. ౨

శ్రీరామం జగదీశ్వరం జనకజాజానిం జనానందనం
జంతూనాం జనకం జనార్తిహరణం లోకేశ్వరం శాశ్వతమ్,
జాబాల్యాది మునీశ్వరైః పరివృతం జాజ్వల్యమానం సదా
జంఘాలం జమదగ్నిసూనుహరణం జాతానుకంపం భజే. ౩

శ్రీరామం కరుణాకరం గుణనిధిం సీతాపతిం శాశ్వతం
పారావారగభీరమబ్జనయనం ప్రావృడ్ఘనశ్యామలం,
వీరశ్రేష్ఠమనామయం విజయినం విశ్వప్రకాశాత్మకం
ఘోరారిత్రికరాధిజప్రహరణం కోదండరామం భజే. ౪

రామస్సీతాసమేతో నివసతు హృదయే సానుజం రామమీశే

రామేణ క్షీణపాపస్త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యామ్,
రామాదన్యం న జానే న హి కిమపి మహో రామనామ్నస్సమానం
రామే పశ్యామి విశ్వం భువనమనుదినం పాహి మాం రామచంద్ర! ౫

శ్రీరామకర్ణామృతము. ౧ ఆ.

మహాశయులారా! ఉత్తమమార్గాన్వేషణపరాయణు లారా! శ్రీరామావతారతత్త్వమున మొదటిప్రకరణమును బఠించితిరి. అందు శ్రీరామావతారకారణము, భగవంతుని భక్తరక్షణపరాయణత్వము లోనగువిషయములు గలవు వానిం బఠించుటచేత శ్రీరామావతారమే మిథ్యయన్నవాదము దుర్వాదమని యెఱింగియుందురు. శ్రీరామావతారము కేవల ధర్మసంస్థాపనార్థమే యన్నవిషయము వ్రాయఁదగియుండియు నది బాలకాండాంతమున వ్రాయఁదలఁచి ప్రథమప్రకరణమున వదలఁబడియెననియు నెఱింగియుందురు. శ్రీరామచంద్రుఁడు సామాన్యులలో నుత్తముఁడే యనఁదగునుగాని పురుషోత్తముఁ డన వలనుపడదన్నభావమును వెలిపుచ్చువాదమునకు సమాధానము గ్రంథము తుదముట్టఁ బఠించినఁగాని కుదురదు. కావున సందర్భము సందువొరకినపుడెల్ల నించుకించుక వ్రాయఁ బడుచుండును.

రాముఁడే పరదైవ మనువారు కొందఱు, కృష్ణుఁడే పరాత్పరుఁ డనువారు కొందఱు, శంకరుఁడే పరమపురుషుఁ డను వారు కొందఱు, పరదేవియే వీరందఱఁ బుట్టించునది కావున నామెయే పరదేవత యనువారు కొందఱు లోకమునఁ గలరు. వీరిలో నిన్నినామరూపములవలరుభగవంతుఁ డొక్కఁడే యని తలంచువా రరుదు. ప్రాయశః వీరందఱు పరమతఖండనప్రచం

షులు. అనఁగాఁ దాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనువారి వంటివారు. వీరినెల్ల నిట్టివాదములకుఁ దింపి తోలుబొమ్మలం బోలెనాడించుచుండునది కర్మము. దాని త్రిప్పులకు లోఁబడనివా రీలోకమునఁగా దేలోకమున నుండరు. తుదకు భగవంతుఁడు కూడ నామరూపధారియగునపు డద్దానివశమున నుండును. అనఁగాఁ దాను కర్మబద్ధునివలె నటించుననియే యిందలి సారము. ఆనటనమున లోకమున కుపకారము కలుగును. “కర్మము బలవత్తమము” అనుసిద్ధాంతము మది నెవ్వారికి నాఁటునో వారి కహంకారము తొలఁగును. నేను ఇతరుఁడు అన్నభావము తుచ్ఛమని తోఁచును. దానిచే భగవంతునియందు భక్తి కుదురును. అయ్యది నిర్మలజ్ఞానము నుత్పాదించును. దాన వైరాగ్యము పట్టుపడును. అది యైహికఫలముల నాశింపక యుండఁజేయును. దాన ఫలాభిసంధిరహితసత్కర్మాచరణపరాయణత్వము కుదురును. అయ్యదియే వైరాగ్యఫలమని పెద్దలందురు. అయ్యది పామరులకు సత్కర్మాచరణమునకు మార్గదర్శకమగును. ఇట్టి యుత్తమమార్గమును జూపించుట కాదికారణము కర్మము బలవత్తమమన్నతలంపే యని యెఱుంగుట తెఱంగు. లేనిచో నహంకారము శాంతమునకుఁ జోటీయక మనసున నిండియుండును. దానిని దొలఁగింప వేఱుమార్గములు చాలవు. కర్తృత్వాభిమానపరిత్యాగ మొక్కఁడే చక్కనిమార్గము. అట్టి యుత్తమమార్గమును బెద్దలు చూప సిద్ధముగనుండఁగా దానికి విముఖులుగఁ బ్రవర్తించువారలకు దుష్కర్మమే కారణము కాక మతేమగును? కనుకనే శ్రీకృష్ణపరమాత్మ,

"అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః"
అని గీతాశాస్త్రమున వక్కాణించెను. కొందఱీసిద్ధాంతమును స్వానుభవమున నెఱింగియుండియుఁ బ్రాగ్దుష్కర్మవశమున దానిం బాటించి ప్రవర్తింపక యహంకారమునకు లోఁబడు దురు. దానిచేతనే దైవ మొక్కఁడే యనియు ననేకనామ రూపముల భక్తానుగ్రహార్థము ధరించుననియునిం దేనామమును రూపమును దలంచినను ధ్యానించినను ఆపరమాత్మ కరుణించు ననియు నమ్మరు. అంతియకాక యితరదేవతల దూషింతురు.

మఱికొందఱు భక్తులవలె నటించుచుఁ బామరులను వంచించుచు ధర్మోపన్యాసముల నిచ్చుచు వానిమూలమున నర్థార్జనముచేయుచు మతగురువుల మనిపించుకొనఁ బ్రయత్నింతురు. ఈజాతిమానవులు ప్రాయశః శైవులో వైష్ణవులో యయియుందురు. వీరిరువురును దమగతి నరికట్టుకొనుమూఢులే యనవలసివచ్చును. ఇందొక్కఁడును బరమశివునిగాని, శ్రీమన్నారాయణమూర్తినిగాని కాంచినవాఁడు లేఁడు. పాషాణగృహమున నీలపాషాణమునకు నామమును గల్పించి యద్దానిం జూచుచు నదియే భగవంతుఁ డనుకొనువారే పైవారలగుదురు. ఆమూర్తిదర్శనము చర్మచక్షుష్కులకెల్లఁ గలుగునదియే. దానియందుఁ దారతమ్యము లున్నవన్నవాదమే యాభక్తుల మతోద్ధారణము. అంతియకాని వేఱొండులేదు. విగ్రహారాధన మతిస్వల్పఫలప్రదమటఁ గేవల పామరులకొఱకది యేర్పఱుపఁబడినది. అంతియకాని దానిం బ్రధానముచేసికొని సర్వకాలము దానినే యాచరించు టుత్తమమార్గము కానేరదు. తలుచుగాఁ బైఁజెప్పఁబడినశైవులు వైష్ణవులు విగ్రహారాధన

ప్రధానులు. అందు శైవులు నిరవయవమూర్తి నారాధించు వారు. వైష్ణవు లట్లుగాక సర్వాంగసంశోభితమృత్పాషాణాద్యన్యతమకల్పితవిగ్రహమును నవరత్నాభరణసంశోభితముగ నొనరించి పూజించి యానందించువారు. ఈరెండింటియందుఁ దొలిమార్గ మించుక యుత్తమము. ఈవిషయమునందు,

"శుభ్రమార్వం హారం కృత్వా మహాపురుషవిగ్రహామ్,
ఈశివాంస్త్వం జప్యైర్హోమై రుపహారైశ్చ మానద. ౯౪
స తథా పూజ్యమానస్తే పూర్వదేహేఽప్యతూతుషత్,
పుష్కలాంశ్చ వరాన్ ప్రాదాత్తవ విద్వన్ హృది స్థితాన్. ౯౫
జన్మకర్మతపోయోగా స్తయోస్తవ చ పుష్కలాః,
తాభ్యాం లింగేఽర్చితో దేవస్త్వయార్చాయాం యుగే యుగే. ౯౬
స ఏవ రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః. ౯౭
ఆత్మయోగాశ్చ తస్మిన్ వై శాస్త్రయోగాశ్చ శాశ్వతాః,
ఏనమేవాయజన్ దేవా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౯౮
ప్రార్థయంతి పరం లోకే స్థాణుమేకం స సర్వకృత్,
కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః. ౯౯
సర్వభూతమయం జ్ఞాత్వా లింగమర్చతి యః ప్రభుః,
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజః." ౧౦౦

ద్రోణపర్వము. ౨౦౨-వ యధ్యాయము.

అను నీమహాభారతవాక్యము లుదాహరింపఁదగినవి. విగ్రహముగ శివుని నశ్వత్థామ పూజించెను. శ్రీకృష్ణుఁడు మృత్తికం గొని లింగముగ నొనరించి యందు శివు నావహింపఁజేసి పూజించెను. కాన నీకంటె శ్రీకృష్ణు నుత్తమభక్తునిగ శంక

రుఁడు భావించునని వ్యాసమహర్షి యశ్వత్థామ కుపదేశించెను. దీనింబట్టి యూహింపఁగా భగవంతు నవయవవిశిష్టునిగా భావించుటకంటె నిరవయవునిగా ధ్యానించుటయే యుత్తమమని తేలెడిని. కావుననే దేవాలయములు పామరులకొఱకే కట్టింపఁబడినవని యింతకుముందుఁ బెక్కుసారులు వ్రాయఁబడినది. దేవాలయములనే నమ్ముకొని యాపూజయే ముక్తి నిచ్చునని ప్రాఁకులాడువారు పండితులవలె నటించుపామరులే. వారు పామరుల నుద్ధరింప నీకార్యము సాగించుచు మానసికపూజ గావించుచుందురేని ధన్యులే యగుదురు. కాని యట్టివారిచర్య వేఱు. మానసికపూజ యనఁగా వస్తువులతోఁ బనిలేని నిర్మలధ్యానమని యర్థము. ఆపూజయంతయు భావనాత్మకము. ఆభావనయుఁ గొంతకాలము సాగఁగా,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." ౨౯

గీత. ౬ అధ్యా.

అను శ్రీకృష్ణోక్తమార్గము పట్టుపడును. ఆస్థితియందుండువాఁడే యోగియనంబడును. కనఁబడునదియంతయు భగవన్మయముగా నతనికిం దోఁచును. కాఁబట్టి గీతాశాస్త్రముకూడ విగ్రహారాధనము నంగీకరింపదని యెఱుంగనగును.

రామశబ్దముకూడ నీవిషయమునే తెలుపుచున్నది. యోగి నిర్మలమనఃకమలవిహారము చేయువాఁడుకదా రాముఁడు. అట్టివాఁడు పరమపురుషుఁ డనఁబడును. ఆతఁడే పరమాత్మ. ఆత్మతత్త్వమన్న నదియే; పరబ్రహ్మమన్న నదియే. శబ్దములనుబట్టి లింగభేదములు గల్గినవియేగాని వస్తువను

బట్టి కాదు. అలింగ మనామమ రూప మనిర్దేశ్యము నగునదియే పరమాత్మ. ఆపరతత్త్వమునకు నామరూపకల్పనము భక్తుని యిచ్ఛాధీనము. కావున నెవ్వాని కేరూప మేనామ మిష్టముగ నుండునో వా రానామమున నారూపమున నాపరబ్రహ్మమును బిలువవచ్చు. అంతియేకాని వేఱొకఁడు తనవలెనే భగవంతుని బిలువ నులికిపడి యానామ మారూప మాతనికిం జెల్లదన రాదు. ఈలోకమే పరమాత్మ దనియు నిం దేయుండుననియుఁ దెంపఱితనమున వాదింపరాదు. అది భగవన్మహిమమును దూషించి నట్లగును. సర్వసమత్వ సర్వసాక్షిత్వ సర్వవ్యాపకత్వము లెగిరి పోవును. ఈవిషయమునే యుపనిషత్తులు బోధించును.

"యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితం,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. ౧౧
యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం. ౧౨
గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః. ౧౩
అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః.
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. ౧౪
సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహం." ౧౫

గీత. ౧౫ అధ్యా

అను నీభగవద్గీతోపనిషత్తు వ్రాసినభావమును సిద్ధాంతము చేయుచున్నది.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం." ౬౨
గీత. ౧౮ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము తుచ్ఛవాదములఁ దూలఁగొట్టుచు భగవంతుని సర్వవ్యాపకత్వమును వెలిపుచ్చుచున్నది.

ఉపనిషత్తులు మొద లూఁకుడుకథలవఱకు భగవంతునకు సర్వనామములు సర్వరూపములు చెల్లునని స్పష్టముగాఁ దెలుపుచుండ విష్ణువే పరమాత్మ యని వైకుంఠమే తన్నివాసమని వాదించుటయు, శంకరుఁడే పరమేశ్వరుఁడని కైలాసమే తన్నివాసమని వాదించుటయు,నజ్ఞానవిశేషముననే యని తేటపఱుచుచున్నది.

భగవత్తత్త్వమును దెలిసికొనఁదగినవా రీపాడు వాదములలోఁ బ్రవేశింపరాదు. పరమతసహనముకలిగి గురూపదిష్టమార్గమున నాపరాత్పరుని ధ్యానించుచు నుండవలయును. సర్వమతము లాపరతత్త్వమునే మార్గభేదములచే నధికారిభేదముచేఁ దెలుపుచున్నవి. అంతియకాని మతకర్తలకుఁ దెలియదనరాదు. శిష్యయోగ్యత నెఱింగి తదుచితముగా వారు బోధింతురు ఈవిషయము నెఱింగినవా రితరుల దేవతోపాసన పద్ధతుల నాక్షేపింపరు. తత్త్వమెఱుంగక యెఱింగినట్లు నటించువారే వాదింతురు. వారు కుక్షింభరులలో నగ్రేసరులు.

కొందఱు మధ్యవైష్ణవులు భక్తిమార్గమున నాఱితేఱినట్లు నటించుచుఁ బామరుల కేదో తెలిసితెలియని మంత్రము

నుపదేశించుచు దేశికులఁ బూజించుటకంటె నుత్తమపూజ యింకొక్కటి లేదనియు, సర్వస్వము దేశికున కర్పించి చేతులు జోడించుకొని సేవచేయుచుండవలయుననియు, నా దేశికుఁడే చేయిపట్టుకొని వైకుంఠమును జేర్చుననియు, దేశికులయుచ్ఛిష్టము భుజింపఁదగుననియు, నేవో నాలుగు చచ్చుశ్లోకములు చదివి వారిని వంచించి ధనము సంపాదింతురు. కాని యావృత్తి తమజీవితమును బాడుచేయునని వా రూహింపరు. ధనాశయే వారి నట్టిదుర్వృత్తికిఁ బాలుపడఁజేసిన దనుట స్పష్టము. అట్టి దాంభికుల మాయావాగురులకుఁ జిక్కి పామరులు చిరసంచిత ధనసంచయము నర్పించి మోక్షమున కెదురుచూచుచు నుందురు. ధనాపగమమే మోక్షమని వా రెఱుంగరు. పాపము! అట్టి మూఢుల వంచించి యేమి మూటగట్టుకొనుదురో తెలియదుగాని ధనము నేమో మూటకట్టుకొనుటమాత్రము సత్యము. అట్టి వంచకులమాటలనే విని నమ్ముదురు. కావుననే శ్రీశంకరభగవత్పాదులవారు,

"అర్థం తత్త్వమసీతివేళగదితం నో విశ్వసత్యల్పధీః."

అని పేర్కొనిరి. ఈశ్రుతివాక్యల నాలకించువారు నమ్మువారు కొందఱే యుందురు. పూర్వోక్తభక్తులందఱు విగ్రహారాధకులే. అదియే వారికి జీవితము. కావున నెన్నిజన్మములకైన వా రుత్తమమార్గము నరయఁజాలరు ఇఁక వారి నమ్మినవారిగతియో యధోగతియే.

భగవత్సేవ కెల్లరు నధికారులే యని కొందఱనఁగా మఱికొందఱు కారు కారందురు. తారతమ్యము గలదనుట సత్యమే. అది తత్కృతకర్మముపై నాధారపడియుండును.

దేవాలయములయందలి పాషాణాదిమూర్తుల నెల్లరు పూజింప రానువారు కొందఱు గలరు. సాధువు లామార్గము నంగీకరింతురు. ఏల? విగ్రహారాధన మల్పఫలప్రదము గాన నద్దాని కాయర్చకుఁడే పాల్పడుఁగాక యని వారియాశయము. అట్టి పూజ నెవ్వారు కోరుదురు? ఈవిగ్రహములపైఁ గలభక్తియుఁ దదారాధకుల వాక్కులు సత్కర్మానుష్ఠానవిహీనులనుగా నెల్లరఁ జేయుచుండుట యథార్థము. కావున నట్టి యపూర్వ భక్తులమాటలఁ జెవియొగ్గి యాలకింపక వారివారికిం దగిన సత్కర్మముల నాచరించుచు వానివలనఁ గలుగుఫలముల భగవంతున కర్పించుచు లోకులకు నందును బామరులకు మార్గదర్శకులై పరిశుద్ధాంతఃకరణులై భగవంతు ననుగ్రహమునకుఁ బాత్రులు కావలయును.

శ్రీరామచంద్రు నర్చించుమార్గము నిరుపమానము. అది యోగశాస్త్రగమ్యము. అనఁగా ధ్యానమే యని సారము. భక్తి దృఢముకాఁగా నాపరమపురుషుని నిరంతరము ధ్యానించుటయే యారాధనము. దీనికే మానసికపూజ యని పేరు. దానియందును రెండుభేదములు గలవు. మనఃపీఠమున నభీష్టదేవతారూపము నావహింపఁజేసి సంకల్పకల్పితపదార్థము లర్పించుట యొక్కపద్ధతి. మనోవీథియందు భగవంతునిఁ దేజోరూపునిగా ధ్యానించుచుఁ దదేకాగ్రచిత్తుఁడై యానందించుచుండుట వేఱొక్కపద్ధతి. ఈరెండింటియం దీరెండవమార్గ ముత్తమోత్తమము. దీనినే శాక్తమున సమయాచారమందురు. యోగమతమే శాక్తమని యెఱుంగఁదగినవిషయము. అల్పమతు లనుకొనునట్లు మద్యమాంసనిషేవణము శాక్తముకాదని యెఱుఁ

గుట బుద్ధిమంతుల లక్షణము. ఈవిషయము శ్రీశంకరభగవత్పాదులవారు సౌందర్యలహరియం దిట్లు నిర్వచించియున్నారు.

"జపో జల్ప శ్శిల్పం సకల మపి ముద్రావిరచనా
గతిః ప్రాదక్షిణ్యక్రమణ మశనాద్యాహుతివిధిః,
ప్రణామ స్సంవేశ స్సుఖమఖిల మాత్మార్పణదృశా
సపర్యాపర్యాయ స్తవ భవతు యన్మే విలసితమ్." ౨౭

"అత్రేదమనుసంధేయం. సమయినాం మతే సమయస్య సాదాఖ్యతత్త్వస్య సపర్యా సహస్రదళకమల ఏవ, న తు బాహ్యే పీఠాదౌ. యే యే సమయినో యోగీశ్వరా జీవన్ముక్తా స్సంసారయాత్రా మనువర్తమానాః సాదాఖ్యతత్త్వ మనుచింతయంతః, ఆత్మైకప్రవణా వర్తంతే, తేషాం జపో జల్పశ్శిల్ప మిత్యాదినా సపర్యాప్రకారో నిరూపితః.యత స్సమయినో యోగీశ్వరా విజనే గుహాంతరేవా బద్ధపద్మాసనాః నిగృహీతేంద్రియాః.సాదాఖ్యతత్త్వజ్ఞానైకనిష్ఠా వర్తంతే తేషాం వక్ష్యమాణచతుర్విధవద్యైక్యానుసంధాన మేవ భగవత్యా స్సపర్యే త్యర్థా దుక్తం భవతి. యతశ్చ పక్షద్వయేఽపి బాహ్యపూజాయాం తత్క్రియాకలాపే చ తత్సంపాదనాయాం చ క్లేశో నాస్తీతి సమయినా మితి రహస్యం. యత్తు చంద్రజ్ఞానవిద్యాయాముక్తమ్.

"సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం,
పాశాంకుశధనుర్బాణాం ధారయంతీం ప్రపూజయేత్." ఇతి.

బాహ్యపూజాప్రకారకథనం సమయైకదేశిమతం" అని వ్యాఖ్య.

కౌళమని సమయాచారమనియు శాక్తమునఁ బూజాపద్ధతులు రెండు. కౌళాచారరతులు యంత్రపూజాతత్పరులు. సమయాచారనిరతులు యోగులు. షట్చక్రములయం దాపరదేవిని జ్యోతిస్స్వరూపిణిగా భావించి ధ్యానింతురు. విగ్రహాపూజయీ యిరుదెఱఁగులవారియందుఁగూడఁ గానరాదు. యంత్ర

మనఁగా శ్రీచక్రమని యర్థము. శ్రీచక్రమున సకలదేవత లుందురు. నిర్గుణుఁ డనంబడు పరబ్రహ్మము తప్పఁ దక్కుంగల త్రిమూర్తులు లోనగువా రాపరదేవిని సేవించుచుందురు. ఈచక్రమున వారినెల్ల భావించి యందు బిందుస్థానమునఁ బరదేవిని ధ్యానించి పూజించువారు కౌళమతావలంబులని యెఱుంగవలయు. దీనికే బాహ్యపూజ యందురు. పూజాద్రవ్య సంపాదనక్లేశము వీరికిం గలదు. సమయాచారనిరతులు యోగు లనంబడుదురు. పూజార్థమై ద్రవ్యములసంపాదింప శ్రమపడ నక్కఱలేక వీరు భగవద్రూపము నాయాచక్రములయందే వరుసగా ధ్యానింతురు. అందు సహస్రారపద్మమునఁ దేజో రూపమును ధ్యానింతురు. వారు జీవన్ముక్తులయి సంసారయాత్ర ననాసక్తులై సాగించుచుందురు. జనసంసర్గము వారి కక్కఱ లేదు. ఏకాంతవాసమే వారికిం గావలసియుండును. సర్వకాల సర్వావస్థలయందు నామహామాయనే దలంచుచుందురు గాన వారు చేయుసంభాషణమంతయు మంత్రజపమే యగును. హస్త చలనాదిక్రియలన్నియు సకలముద్రాప్రదర్శనమే యగును. ముద్రా ప్రదర్శనవిహీనజపము సాంగముకాదనియు సంపూర్ణఫలము నీఁజాలదనియు శాస్త్రతత్త్వము. నడచుటయే ప్రదక్షిణక్రియ యగును. ఏపదార్థమును వారుభక్షింతురో యది హోమమగును. శయనించుట యిటునటుపొరలుట నమస్కారక్రియ యగును. శరీరమునువంచుట లోనగు సుఖకరవస్తువంతయు నాత్మార్పణ బుద్ధిచేఁ బూజారూపాంతరమే యగు. సకలము దేవతార్పణము చేయుదురుగాన వారు చేయుకృత్యము లెల్ల భగవత్ప్రీతికరము లే యగునని సారము. ఇదె శాక్తమునఁ బ్రధానము. ఇదెయే యోగమతము. ఈపద్ధతి శాక్తమున నే కాదు.

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాశ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిస్స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్."

అనునదియు సుప్రసిద్ధమే కదా. ఇదంతయు "భావనామాత్ర సంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న దానిసారము కాదా. "అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా" అన్నదియు నదియే కదా.

"తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా"

అనుశ్రుతియుం బైవిధులకుం బ్రమాణము. వీనినన్నింటిని బరికింపఁగా విగ్రహారాధన మత్యల్పఫలప్రదమనియు, యంత్రపూజ మధ్యమఫలప్రదమనియు మానసికపూజ యనఁగా ధ్యానముత్తమఫలప్రదమనియు, నందును దేజోరూపధ్యాన ముత్తమోత్తమఫలప్రదమనియు సారము తేలెడిని.

శాక్తమునఁ దక్కంగలయైదుమతములకుఁ బూర్ణావకాశము గలదు. తక్కిన శైవ వైష్ణవ గాణపత్య సౌర కాపాలికములయం దట్టియవకాశము లేదు. సప్తకోటిమహామంత్రముల కిందు సన్నివేశము కలదు. కావుననే,

"సర్వే శాక్తాస్సముద్దిష్టా న శైవా న చ వైష్ణవాః"

అను మునివాక్యము పొడసూపెను. ఆకృతిగలవస్తువంతయు, మహాప్రకృతికల్పితమే. కావున బ్రహ్మావిష్ణ్వాదులెల్ల నాప్రకృతికిం బుత్రులని తెలియవలయు. కావుననే ప్రకృత్యుపాసకులు యోగులనంబడిరి. ఏమతమునందును బరిపక్వజీవులకే భగవద

చుగ్రహలాభము కలుగుఁగాని మతప్రవిష్టుల కందఱకుం గలు
గవచుట యెంత తెలిఁగినవిషయము. కావున నే దేవత నుపా
సించినను నద్భిన్న మేదియు లేదనుభావము కలిగి యుపాసించి
ననే పూర్ణఫలము లభించును. భక్తిజ్ఞానవైరాగ్యసహితముకా
దేని వ్యర్థమగును. వానింగూడిన సఫలమగును. ఇవ్విమూఁడును
సత్కర్మానుష్ఠానమూలములు కావేని సమగ్రములుగావు. కావున
సత్కర్మానుష్ఠానము ఫలవాంఛలేక యొనరింప జ్ఞానవైరాగ్య
సహిత మగుభక్తి కుదురును. అట్టివానికి భగవదారాధనము
మానసికమునఁగాక వస్తువ్రాతము సాయముగా గలిగినదికాదు.
బాహ్యపూజచేయుచు నదియే తుదియని భావించువారు సామ
వలనుటయే యీవిషయమునఁ గలసారమని యెఱుంగ
వలయును.

"సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్. ౮

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు. ౯

మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

గీత ౯ అధ్యా.

అను భగవద్గీతావాక్యములు పై విషయమును సిద్ధాంతము
చేయుచున్నవి నిర్గుణపరబ్రహ్మముతప్పఁ దక్కినవా రెల్లనా ప్రకృ

తిచే సృజింపఁబడినవారే యనియు, వారి నుపాసించుచు ముక్తిని బడయఁగోరువారు బాలిశులనియుఁ, బ్రకృతి నుపాసించి తదను గ్రహపాత్రులై పరమపురుషునికరుణకుం బాత్రులు కావల యుననియు భావము. కాని వేఱొండుమార్గము లేదు.

## ప్రకృత్యవతారములు.

లోకమున సత్యధర్మములు సుప్రతిష్ఠం గాంచవలయు నన్నయాశతో భగవంతుని యిచ్ఛాశక్తియగు ప్రకృతి రామ లక్ష్మణభరతశత్రుఘ్నరూపముల నవతరించెను. ప్రకృతిసాయ మునఁ బరమపురుషుఁడు లోకప్రవృత్తిని సాగించునట్లు మాన వులు స్వకీయప్రకృతిసాయమునఁగాని సంసారయాత్ర సాగింపఁ జాలరన్ననీతిని లోకులకు నెఱిఁగింపఁగోరి స్వాంశమున సీతాం బను బుట్టించెను. సీతాసహాయమున నే శ్రీరామప్రవృత్తి సాగును. ఆవిషయ మీ రెండవప్రకరణమున వ్రాయఁబడును. సత్యమార్గాన్వేషణమే ప్రధానమని భావించి పాఠకమహా శయులు మతవైషమ్యముల మనస్సుల నెలకొలుపక దృఢభక్తి గలిగి శ్రీరామచరిత్రము నాలకింపుఁడు. శ్రీరాముని ప్రవర్తనమే స్మృతుల కాధారము. కావునఁ గడుజాగరూకులరై శ్రీరామ మూర్తి యేయేసమయముల నెట్లు ప్రవర్తించి లోకులకు సన్మార్గ ప్రవృత్తిని దెలిపెనో యావిధము నెఱుఁగుచు నందేమాత్ర మైన స్వప్రవృత్తియందుఁ జొప్పించి విఖ్యాతచరిత్రులు కావ లయును. అట్టులగుట శ్రీరామచంద్రదివ్యచరిత్రమును బెక్కు సారులు పఠింపవలయును. ఒకొక్కపర్యాయము పఠించు నపుడు నిందేమివిశేషమని పరికింపవలయును. రహస్యార్థము

కనఁబడుచుండును. మహానంద ముప్పొంగుచుండును. సంసార తాపములు దూరము లగుచుండును. శ్రీరామమూర్తి వైకుంఠమును బాడుపెట్టి వచ్చినవాఁడను మధ్య వైష్ణవులమాటలకుఁ జోటీయకుఁడు. భగవంతుఁడే ధర్మరక్షణార్థ మవతరించెనని భావింపుఁడు. రామమూర్తిని వైష్ణవులు శ్రీమహావిష్ణువే యని తలంపవచ్చును. శైవులు పరమశివుఁడని భావింపవచ్చును. శాక్తులు లలితాంబయే యని నిశ్చయింపవచ్చును. గాణాపత్యులు మహాగణపతి యని యెంచవచ్చును. సౌరులు సూర్యభగవానుఁడని యూహింపవచ్చును. కాపాలికులు మహాభైరవుఁడని చింతింపవచ్చును.

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహం. ౨౧.
స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్." ౨౨.

గీత. ౭ అధ్యా.

అన్న శ్రీకృష్ణపరమాత్మహితబోధము ననుసరించి యాయాయి భక్తు లాయాయారాధనమున కనురూపములగు ఫలముల నొందుదురు. ఇందు వైష్ణవులకే యెక్కుడుస్వత్త్వము లేదనుట సిద్ధాంతము. రామమూర్తి భగవదంశసంభూతుఁ డనఁగా భగవంతుఁడు కార్యార్థ మీమానవరూపమున వెలసెనని సారము. భగవంతుఁడే వైష్ణవుఁడో శైవుఁడో యెవ్వ రెఱుంగుదురు. మే మెఱుంగుదుమనువారు బాలిశులు గాక మఱేమగుదురు? అట్టి పరాత్పరునిఛాయ యగు శ్రీరామచంద్రునిచరి

త్రము గంగాతోయముభంగిఁ బరమపావనము. అట్టిదానిం బఠించుట, దానితత్త్వ మెఱుంగుట, ఆరీతిగాఁ బ్రవర్తింపఁ బ్రయత్నించుట యనునవియే యుత్తమోత్తమకార్యములు. శ్రీరామతారకమంత్రరాజమును జపించుచు, సర్వత్ర రామమూర్తిరూపమును గాంచుచు, సర్వము రామమయముగాఁ దలఁచుచు,శివకేశవాదినామములనెల్ల నొక్కరీతిగా నెంచుచుఁ, బరమతధర్మముల దూషింపక, పరులయుపాసనదేవతలఁ దుచ్ఛములనికాని యల్పఫలముల నిచ్చునవియనికాని పలుకక, యాయాయిభక్తుల మనోవాంఛితములఁ దీర్ప నాయాయియవతారరూపముల భగవంతుఁ డంగీకరించెనని ధ్యానించుచు, సంసారయాత్ర లోకాచారమురీతి నిర్వహించుచు, ఫలాభిసంధిరహితముగా సత్కర్మముల నాచరించుచు, దీనాంధబధిరకుబ్జులం గాంచి వగచుచు, నట్టిగతిఁ గల్గించుకర్మముల నాచరింపకుండఁ జేయుమా యని పరాత్పరునిఁ బ్రార్థించుచు, భూతదయగలిగి యదియే తపఃఫలమని నమ్మి ప్రవర్తించుటయే యుత్తమము. భూతహింసాకర్మములజోలి పోవకుండుటయే గొప్పతపస్సు. తరణోపాయము భగవచ్చింతనము దానిని గల్గించునది ఫలాభిసంధిరహితసత్కర్మాచరణము. దాని కాధారము భగవత్కథాశ్రవణము. కావున నిఁక నామహాకార్యమునకుం గడంగుదము. జపయజ్ఞమునకుఁ బదార్థసంగ్రహ మక్కఱలేదు. భగవద్ధ్యానమునకుఁ బర్వము లక్కఱలేదు. భూతదయకు శాస్త్రజ్ఞాన మక్కఱలేదు సజ్జనసాంగత్యము దానికిం జాలును, కావున సర్వధర్మమూలమగు భగవచ్చరిత్రమును బఠింతము. కుయుక్తులంబన్నుట మానుదము. దుర్వాదముల

జోలికిం బోవమానఁ బ్రతినసేయుదము. పరులు దూషించినఁ దలయొగ్గుదము. మమ్ముఁ గరుణారసభరితాంతఃకరణుండవై కాపాడుమా పరాత్పరా యని ధ్యానింతము. ప్రకృతీ! దయాస్వరూపిణీ! అజ్ఞానమునఁ బడఁద్రోయక తమఃపటలమును విరియించి పరమపురుషుని పాదారవిందముల చెంతకుఁ జేర్పుమా యని ప్రార్థింతము. ప్రకృతినిదూషించిన నధోగతియేగాని తల యెత్త నవకాశము లేదు. హరిహర బ్రహ్మలే యామహామాయా పాదారవిందరజఃకణలేశముల మౌళులం దాల్తురన మన మింక నేపాటివారము?

"అవిద్యానామంతస్తిమిరమిహిరద్వీపనగరీ
జడానాం చైతన్యస్తబకమకరందస్రుతిఝరీ
దరిద్రాణాం చింతామణిగుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి."

అని యాపరమేశ్వరిని ధ్యానించి శ్రీరామమూర్తి పరమపావన కథామృతమును గ్రోలఁ బ్రయత్నింతము.

మహాశయులారా! ప్రథమప్రకరణమున శ్రీరామమూర్తి ధర్మసంరక్షణార్థ మవతరించి యేయే మహాకార్యము లొనరించెనో యందుఁ గొన్నింటిఁ బఠించితిరి. అవి చేయనున్న మహాకార్యములలో మిక్కిలి కొలఁదివి. మహాకార్యకరణమునకుఁ బ్రకృతిసహాయ మత్యావశ్యకము. ఆకార్యమును గొనసాగింప విశ్వామిత్రుఁడు పూనుకొనెను. ఆప్రయత్న మెట్లు కొనసాగెనో యీప్రకరణమునఁ గలదు. ప్రకృతియగు సీతా మహాదేవి రామచంద్రునిరాకకై కాచియున్నది. ఎపుడెపుడా మహామాయంగూడి ధర్మరక్షణము నొనరింతునా యని రామ

మూర్తి త్వరపడుచున్నవాఁడు. మహర్షులు దేవతలు నామహో
త్కార్య మెప్పుడు కొనసాగునా, ఎపుడు దుర్జనులు నశింతురా
యని యువ్విళ్లూరుచున్నారు. సీతారాములు తమశక్తులను
దాఁచి ప్రాకృతులవలెఁ బ్రవర్తిల్లుచున్నవారు. వారిచరిత్ర
ములు విన మన మాతురంపడుచున్నవారము. ఇదియే శుభ
సమయము.

మఱొక్కవిషయ మిట వ్రాయక మానరాదు. సీతా
కాంతకడకు రామమూర్తి యరుగుచున్నవాఁడు. తగినసంబం
ధమునకై జనకరాజు నాలుగు దేశములు తిరుగలేదు. కారణ
మేమి? ప్రకృతి యూహించినంతనే పరమపురుషుఁడు లోఁ
బడును. ఏల? ప్రకృతియన భగవంతునిచ్ఛయే కదా. లోక
మునఁగూడఁ గన్యయుండుతావునకే వరుఁడరుగుచుండుట కనఁ
బడుచుండునుగదా. దీనింబట్టి యూహింపఁగాఁ బ్రకృతిశక్తి
యెట్టిదో పురుషునిశక్తి యెట్టిదో మనకుఁ దేటపడును. ఈఘట్ట
మున ననేకరహస్యములు గలవు. వానిం బరికింపక కథను జది
విన లాభములేదు. సత్కాలక్షేపముమాత్ర మగునుగాని
సంపూర్ణకథాపఠనలాభము దొరకదు తత్సారమును గ్రహించి
యందుండి గ్రహింపఁదగిన దేది యని విమర్శించి గ్రహించిన
దాని నాచరణమునకుఁ దెచ్చుకొని, యంతతోఁ దృప్తి
నొందక తనకంటెఁ బామరులగువారికి వాత్సల్యమునఁ దెలు
పుచు, భగవంతు నారాధింపవలయును. కావున నిఁక నట్టి
ప్రయత్నమునకుం గడంగుదము. ప్రథమప్రకరణమున శ్రీ
రామచంద్రుఁడు లక్ష్మణవిశ్వామిత్రులంగూడి పోవుచు గంగా
నదిని దర్శించెను. తన్మహత్త్వము నెఱుంగనియట్లు లాకౌశికు

నడిగెను. లోకాచారమును బాటించి యడిగెంగదా యని యొంటింగి యమ్ముని పామరునకుం దెలుపునట్లు తెలుపుచుండెను. రామమూర్తి యాలకించుచుండెను. గంగామాహాత్మ్యము నెఱింగించి దానిచరిత్రమును దెలుపుటకు మౌని ప్రయత్నించె నన్నదనుకం బ్రథమప్రకరణమునంగలదు. దానితరువాతివిషయ మిందు వ్రాయంబడును. దానిం బఠింపుడు. దానికిం బ్రోలుత శ్రీరామచంద్రమూర్తియాకారమును మది నిల్పుఁడు. భక్తి భావమునం బఠింపుఁడు. వ్రాయునపుడు వ్రాసినవిషయమే మరల వ్రాయుటయుం దటస్థించును. అదిముఖ్యవిషయమనియుఁ, బలుసారులు పఠింపఁదగుననియు భావింపుఁడు. పునరుక్తమని యీసడింపకుఁడు. నాయందుం గనంబడుచునీర్ష్య మిమ్మే బాధించును. భగవంతుని శ్రీరామచంద్రు నొక్కసారి ప్రార్థించి తద్దివ్య చరిత్రము నిఁక వ్రాయుదును. కథారంభమున దివ్యమంగళ విగ్రహుఁడగు రామమూర్తిని ధ్యానించుచున్నాఁడను.

"బ్రహ్మాద్యామరసిద్ధజన్మభువనం యన్నాభిపంకేరుహం
శ్రీనిర్వాణనికేతనం యదుదరం లోకైకశయ్యాగృహం,
యద్వక్షః కమలావిలాసభవనం యన్నామమంత్రం సతాం
వాసాగారమఖండమంగళనిధిః పాయాత్స వో రాఘవః."

(శ్రీరామకర్ణామృతము)

## సగరచక్రవర్తిచరిత్రము.

* గంగామాహాత్మ్యమును దెలిపి సవిస్తరముగా దాని చరిత్రమును దెలుపుమని రామమూర్తి యడిగినందున నింకను

* ఈభాగము ముప్పదెనిమిదవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

దెలుపఁ బూని విశ్వామిత్రుఁ డిట్లు తెలిపెను. రామచంద్రా! ఇంకను గంగానదిమహిమము చెప్పఁదగినది కలదు. వినుము. అయోధ్యాపాలకులలో సగరుఁ డనుచక్రవర్తి యుండెను. శూరుఁడు ధర్మాత్ముఁడు నగుచు నతఁడు రాజ్యమేలెను. సంతానము లేకయుండ దానిఁ బడయంగోరి, తొలిభార్యయు విదర్భరాజుకూఁతురునగు కేశినియుఁ, గాశ్యపునిపుత్త్రికయు రెండవభార్యయునగు సుమతియు వెంటరాఁగా, హిమవంతమున కరిగెను. తొలిభార్య ధార్మికురాలు. సత్యవాదిని. రెండవభార్య సుందరాంగి. ఇరువురును బురంధ్రీమణులే. భృగుప్రస్రవణమను హిమాలయ ప్రత్యంతపర్వతమున నిలిచి తపం బొనరించెను. అంత శతసంవత్సరములు నిండఁగా మహాతపస్వియగు భృగుముని యారాజుం గని, "నీకు మిక్కిలి సంతానము కలుగును. తన్మూలమున నీకీర్తియు నిస్సమతఁ గ్రాలును. నీభార్యలయం దొకర్తుక కులదీపకుఁడగు నొక్కతనయుం గాంచును. వేఱొక్కతుక యఱువదివేవురు కొడుకులం గాంచును." అని వర మొసంగెను. ఆరాజపత్న్యు లమ్మునిని సేవించి యంజలులు బంధించి, "మహానుభావా! మాలో నొక్కకుమారుం గాంచునది యెవ్వతె? అఱువదివేవురం గనునది యెవ్వతుక? దీనిఁ దెలుపుమా. నీ వన్నయట్లే యగు"నని పలుక విని పరమధార్మికుఁడగు నమ్ముని వారితో "నోపురంధ్రులారా! మీమీయిచ్ఛలం దెల్పుఁడు." అని యడిగెను. కేశిని వంశకరు నొక్కతనయుం గోరెను. గరుత్మంతునిసహజాతయగు సుమతి మహోత్సాహులై కీర్తిమంతులై యలరారు నఱువదివేవురం బుత్త్రుల నాశించెను.

సగరుఁడును భార్యలంగూడి సాష్టాంగవందన మాచరించి తదాశీర్వాదములంది వారు కోరినరీతి నగునని యమ్ముని పలుకఁ దనపురమునకుం బోయెను. కొంతకాలమునకుఁ గేశిని యసమంజుఁడను కుమారుం గాంచెను. సుమతియో గర్భముం దాల్చి యలాబూఫలమువలెఁ గుండ్రనై యుండుపిండమును గాంచెను. ఆతుంబమును ఛేదింప నందుండియఱువదివేవురుకుమారు లుద్భవిల్లిరి. ఉపమాతలు ఘృతపూర్ణకుంభములయందు వారిని బెంపఁగాఁ జిరకాలమునకు వారెల్లఁ బెరిగి యౌవనవంతులైరి. శ్రీరామచంద్రా! పెద్దభార్యకొడుకగు నసమంజుఁడు ప్రతిదిన మానగరమునఁ గలబాలకులం బట్టుకొని పోయి సరయూనదీజలంబులం బడవైచి వారందు మునుఁగుచుండ నవ్వుచు నానందించుచుండెను. ఆతఁడిట్లు దుష్ప్రవర్తకుఁడై సజ్జనులను వేధించుచు బాలకులఁ జంపుచు నుండుటయే కారణముగా నాకొడుకుం బౌరానుమతినొంది సగరుఁడు పురమునుండి వెడలఁగొట్టించెను. ఆయసమంజునికొడు కంశుమంతుఁడు. సకలజనసమ్మతుఁడు. ఎల్లరకు నుపకారియై యుండెను. కొంతకాలముసాగఁగా సగరమహీజానికి యజ్ఞముచేయనుద్దేశము కలిగెను. పెద్దలతో నాలోచించి నిశ్చయించుకొని వేదవేత్తగాప్రన ఋత్విక్సమాజమునుగూడి యశ్వమేధము నొనరింప నారంభించెను.

## సగరునియజ్ఞాశ్వమును హరించుట.

*ఆమాట విని—యజ్ఞముచేయ యత్నించెనన్నమాట విని పరమానందమునొంది, యగ్నివలె వెలుంగు నాకౌశికునిం

*ఈభాగము ముప్పదితొమ్మిదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

గాంచి, "మహాత్మా! ఆయజ్ఞవృత్తాంతమునువినవలతు" నని ప్రశ్నిం
చెను. తనవంశమునఁ బుట్టి పూర్వుఁడగు సగరునియజ్ఞవిధాన
మును వినఁగోరెనన్నభావ మాప్రశ్నమున నిమిడియుండెను.
మునియుఁ దాఁజెప్పనెంచినవార్త నేయడిగెనని సంతసిల్లి స్వవంశ
భవులయందు నీపరమేశ్వరునకుంగూడ లోకసామాన్యమున
కుంగలప్రీతి కలదే యని నవ్వుచు నిట్లు పలికెను. "రామచంద్రా!
ఆలకింపుము. సగరచక్రవర్తిచరితము నాలకింపుము. శంకరుని
మామయగు హిమవంతుఁడు వింధ్యపర్వతమునకు సమీపమున
నుండి తమరెండింటికినడుమ పెద్దకొండలు లేనందున నొండొ
రులం జూచుకొనుచున్నట్లు కనఁబడుచుండెను. ఆరెండుకొండల
నడుమ నుండుదేశమే యార్యావర్త మనంబడును. ఆదేశము
యజ్ఞకర్మములకుఁ బ్రసిద్ధమైనది. ఆదేశమునందే సగరునియశ్వ
మేధము సాగెను.

యజ్ఞాశ్వమువెంట నంశుమంతుఁడు ధనుర్ధారియై రక్ష
కుఁడై పోయెను. అట్లు యజ్ఞము సాగుచుండఁగా నాయజ్ఞా
శ్వము నింద్రుఁ డపహరించెను. మాయామయమై యజ్ఞవిఘ్న
కరమగు రాక్షసదేహము నాయింద్రుఁడు ధరించి యాదుష్కా
ర్యము నొనరించెను. ఉక్థ్యము చేయుదినముననే యపహరించి
నందున ఋత్విజులందఱు సగరుం గాంచి 'యీయశ్వాలంభన
దినమునందే నీయజ్ఞమును బాధచేయఁబూని యెవ్వఁడో
యశ్వము నపహరించెను. వానిం బొలియించి హయమును
దేఁబంపుము. ఇది సాగకయున్న మనకెల్ల నశుభము కలుగును.
కావున మహారాజా! ఈయాగమున నేయపరాధము కలుగక
యుండ నొనరింపుమా'యని వేఁడిరి. ఆపలుకులు విని తనకుమా

రుల నఱువదివేవురను జూచి "పుత్త్రులారా! ఈమహాయజ్ఞము మంత్రసంశుద్ధిగలిగి పూజ్యులగుఋత్విజులచేఁ జేయింపఁబడుచున్నది. కాన రాక్షసులు ప్రవేశింపఁజాలరు. ఈయశ్వ మెట్లు పోయినదో కనుఁగొనుఁడు. మీకు శుభంబగుఁగాక. సముద్ర పరివేష్టితమగు భూమండలమెల్లఁ బరికింపుఁడు. భూమండలము విశాలమైనది. మీరు వరుసగా నొక్కొక్కయోజనముగా నన్వేషింపుఁడు. నాపంపున నశ్వాపహర్తను వెదకుచు భూమియందెందైన వాఁడు దొరకఁడేని వెనుకకు రాక యావంచకుఁడు కనఁబడునంతదాఁక భూమిని ద్రవ్వియైనఁ జూడుఁడు. దీక్షితుఁడనుగా నున్నవాఁడనుగాన నిందే యుండవలయును. కాని రాఁజనదు. కావున నేను మనుమఁడు ఋత్విక్కులు నిందే యశ్వము వచ్చుదాఁక నుందుము. ఈయాగదీక్షానియమము లట్టివి. కాన వదలి రా నయితిగాదు.' అని పలుకఁగా నాలించి యా కుమారులు వీర్యవంతులుగానఁ బయలువెడలి జనకునానతిరీతి వెదుకసాగిరి. అందందు భూమిని ద్రవ్వియుఁ బరికించిరి. భూతము లార్చెను. ఆధ్వని మిక్కుటముగా వ్యాపించెను. దేవతలు బ్రహ్మకడకుంబోయి 'సాగరులు భూమినిజీకాకుపఱచుచున్నారు. రసాతలవాసులఁ జంపుచున్నారు. చూచినవారినెల్ల వీఁడే హరించె నిదియె యజ్ఞాశ్వమని హింసించుచున్నవారు. చూడఁ దరముగాకున్న'దని విన్నవించిరి.

సగరకుమారులు కపిలమునికోపాగ్నిదగ్ధులగుట.

*బ్రహ్మ దేవతలమనవి నాలకించి ప్రజలార్తివొందుటకై దేవతలు తపించుచున్నారని యెఱింగి వారితో నిట్లు పలికెను.

* ఈభాగము నలువదియవ సర్గమునుండి సంగృహీతము.

"ఈభూమియంతయు శ్రీమహావిష్ణుస్వత్వము. ఆ దేవుఁడు కపిల మునిరూపమున నీభూమిని ధరించియుండును. సగరసూనులు భూమినిగొనినయెడలఁ దదీయస్వామియగు కపిలమునికోపాగ్ని చే దగ్ధులగుదురు. భూమి యిట్లే ప్రతికల్పమునందును ద్రవ్వఁబడు చుండును. పూర్వమే యిది నిర్ణయింపఁబడినది. ఈసగరకుమా రులు దీర్ఘకాలము జీవింపక నశింతురని మున్నే నిర్ణీతము." అనఁ గానే దేవాదులు హర్షించిరి. తమతమనెలవులకు వెళ్లిరి. ఆరీతి సాగరులు భూమిని ద్రవ్వుచుండఁగా వారికి నాశనముం దెలు పుచు నొకశబ్దము భయంకరముగా వినఁబడియెను. వారట్లు భూమినిద్రవ్వి దానిచుట్టుం దిరిగిచూచి యశ్వమునుగనఁజాలక యందఱుంగూడుకొని తండ్రికడకుం బోయి తమప్రయత్న మంతయుఁ దెలిపి యశ్వము కానరాలేదనిరి. మీకు శుభం బగుఁగాక. ఉపాయమారసి చెప్పుఁడని పలికిరి.

సగరుఁ డామాటలు విని యశ్వము దొరకలేదనుకోప మునఁ 'గొమరులారా! మీకు మేలగుంగాక. మరలఁ బోయి భూమిని ద్రవ్వి పరికించి యశ్వాపహర్తను, అశ్వమును దీసికొని రండు. కృతకృత్యులరై మరలుఁ'డని యాజ్ఞాపించెను. అంతట వారు మరలఁ బోయి రసాతలములఁ గాంచి దానిని ద్రవ్వ చుండఁగా నందొక్కచోఁ బర్వతమువలెఁ గనఁబడుచు భూమిని ధరించుచున్న విరూపాక్షమను దిగ్గజము కనంబడియె. ఆదిగ్గ జము పర్వతకాననాదులతోఁ గూడినభూమినివహించి యుండెను. ఆగజము భూభారవహనమున నోర్పులేక శిరస్సు నెపుడు కద ల్చునో యపుడే భూకంపముగలుగును. ఆదంతావళరాజమును గాంచి ప్రదక్షిణ మొనర్చి పూజించి యవ్వలంబోయిరి. తూర్పు

దెసప్రక్కలించి యందశ్వమునుగానక దక్షిణభాగమును ప్రక్క-
లింపఁబూనిరి. ఆదెసయందు గొప్పకొండవంటి దేహముకలిగి
మహిమముకలిగియున్న మహాపద్మమను దిగ్గజరాజమును గాంచి
యది భూచక్రమును దలఁదాల్చుటకు నెంతయు నచ్చెరువందిరి.
దానికిని బ్రదక్షిణముచేసి యవ్వలం బడమరదిక్కును భేదింపఁ
బూనిరి.

ఆభాగమున గొప్పయాకృతిమీఱనున్న సౌమనమను
పేరుగల దిగ్గజమును పలకించి దానికిని బ్రదక్షిణమొనర్చి కుశల
ప్రశ్నముగావించి సెలవంది యుత్తరపుదిక్కునకుం జని దానిం
ద్రవ్వంబూనిరి. రామచంద్రా! అందుఁ జక్కని దేహము
గల్గి శ్వేతవర్ణమునఁ బ్రకాశించుచు భద్రమను దిగ్గజమును
దర్శించి దానిని దాఁకి వలగొని మ్రొక్కి యాభాగమును
భేదింపసాగిరి. అవ్వల నీశాను దెస కరిగి రోషాతిరేకమునఁ
ద్రవ్వుచుఁ బోయిపోయి సనాతనుఁడగు వాసుదేవుని గపిలావ
తారుని గాంచిరి. ఆద్దేవునకుఁ గొంతదూరమున మేయుచుఁ
దిరుగుచున్న యశ్వమును గాంచిరి. అందఱునందుల కానందించి
యామహాత్ము నశ్వాపహారకునిగాఁ దలంచి కోపమున నేత్రము
లరుణములు కాఁగా నానాప్రహరణములఁ దాల్చి పరుగెత్తి నిలు
వుము. నిలువుమని యదలించుచు, 'నోరీ! నీవు మాయజ్ఞాశ్వ
మును హరించితివి. దుర్బుద్ధీ! సగరకుమారులము. ఇదె వచ్చి
తిమి. వారినివీరినిగాఁ దలంపకుము.' అని యిట్లు తన్నదలింపఁగా
వారల యాదుష్టాలాపముల నాలకించి నిర్భరకోపావేశమున
నాకపిలముని హుంకారమొనరింప నామహాత్మునినేత్రాగ్ని
జ్వాలలచే వారలెల్ల భస్మరాసులై పడిరి.

మహాశయులారా! ఈభాగము చక్కఁగా విమర్శింపఁ దగినది. సావధానముగా నాలకింపుఁడు. సగరరాజచంద్రుని వృత్తాంత మతిచిత్రమైనది. జన్మముందొట్టి యెన్నియో యిక్కట్టులం జిక్కినవాఁడుకదా సగరుఁడు. గరళముతోడఁ బుట్టి మునివరునికరుణ బ్రదికి వినతుఁడైనవాఁడు. తుదకుఁ జక్రవర్తి కూడ నయ్యెను. చక్రవర్తియనఁగా నధర్మమాతనిరాజ్యమున సాగఁగా విష్ణుచక్రమే యాయధర్మము నడంచును. దాననే చక్రవర్తియని యొకయర్థమును బెద్దలు చెప్పుదురు. భూచక్రమునవర్తించు నాజ్ఞకలవాఁడని యొకయర్థము కలదు. ఈయర్థమునఁ బెక్కండ్రు చక్రవర్తులు కావచ్చును. ఆఱుగురుమాత్రమే యన్ననియమ మూడిపోవును. కావున మొదటియర్థమే న్యాయ్యమైనది. అట్టివారు పెక్కండ్రుండరు. ఏలయనఁగా భగవద్భక్తులై వశీకృతపరమేశ్వరులుగా వారుండవలయును. నిష్పక్షపాతముగా రాజ్యమును బాలింపవలయును. ధర్మరక్షణమున బద్ధాదరులు కావలయును. అట్టిరాజ్యమున నెందే నధర్మము చెలఁగిన శ్రీవిష్ణుచక్ర మాదుష్కార్యము నప్పుడ యడంచు. అట్టి భూచక్రము రాజన్వంతమగునుగదా. అట్టివారు కొలఁదిసంఖ్యగనే యుందురు. సగరుఁడందుఁ జేరినవాఁడు. షట్చక్రవర్తులపట్టికలో నైదవవాఁడు. బాల్యమున శ్రమంపడక పెద్దలసాయములేక యెవ్వాఁడును ద్రిజగద్విఖ్యాతిం గాంచలేఁడనుట నిర్వివాదము. సగరుఁ డట్టివాఁడే. కావున విశేషించి ధర్మాత్ముఁడయ్యెను.

సంతానము లేనిదుఃఖము పెక్కండ్రను బాధించుచుండునని పురాణములం బరికించినఁ దేటపడును. సగరునకుం

కూడ నాదురదృష్టమే పట్టెను. ఇరువురుభార్యలుండుట యెట్టి వారికైని దుఃఖమే. ఈతనికి నిరువురుభార్యలు గలరు. వారిం గూడి తపస్సునకుం బోయెను. భృగుప్రస్రవణమను పేరుగల హిమాలయపాదమునకుం బోయెను. భృగుమహర్షి యందే యాశ్రమమును గల్పించుకొనియుండెను. అందే యీసగరుఁడు భార్యాద్వయముంగూడి తపస్సు చేయుచుండెను. తనయాశ్రమమున ధర్మమతియగు రాజు సంతానాపేక్షఁబూని తపస్సు చేయుటయు,నాతనింగూడి భార్యలును నియతిమై నుండుటయు నెఱింగెను. మనస్సు కరఁగెను. తపఃకష్టము నెఱింగినవాఁడు కాన నంతటి భోగానుభవముగల రాజు శ్రమంపడుచు ధర్మ్యమగు వాంఛను బూనుట తగునని నిశ్చయించెను. విశేషించి సుకుమారులగు నా కాంతలిరువురు నియతింబూనుట యమ్ముని చిత్తమును వెన్నవలెఁ గరఁగించెను. కావున నమ్ముని శతవర్షములునిండఁగానే వారినియతికి మెచ్చుకొనెను. సగరుఁ డమ్ముని పతి నారాధించుచుండెను.

"అథ వర్షశతే పూర్ణే తపసారాధితో మునిః,
సగరాయ వరం ప్రాదాద్భృగుస్సత్యవతాం వరః." ౬

పూర్వకాలము తపస్విష్ఠులగుమహర్షులుకూడ వరమొసంగుచుండిరి. తపోబలమున నవ్వరము ఫలించుచుండెను. తపశ్శక్తి యెట్టికార్యమునైన సాధింపఁగలదని యీ ప్రమాణము మనకుఁ దెలుపుచున్నది. ఇట్టిశక్తికిం గారణమేమనఁగా.

"చాతుర్వర్ణ్యం త్రయోలోకా శ్చత్వారశ్చాశ్రమాః పృథక్,
భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి." ౯౭

తపోవిద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరం,
తపసా కిల్బిషం హంతి విద్యయాఽమృతమశ్నుతే."     ౧౦౪
(మను. ౧౨ అధ్యా.)

వేదములను నేర్చి తపస్సానరించి జితేంద్రియులగువార లిట్లు శాపానుగ్రహసమర్థులగుదురు. ప్రధాన మిన్నింటికి జితేంద్రియత్వము. అది యోగాభ్యాసమున లభించును. అయ్యది పూర్వకర్మపరిణతిం గల్గును. కావున సత్కర్మానుష్ఠాన మిన్నింటికి మూలాధారము. అది లేక యెట్టితపస్సు చేయను బుద్ధి పుట్టదు.

"మునేస్తు వచనం శ్రుత్వా కేశినీ రఘునందన,
పుత్త్రం వంశకరం రామ జగ్రాహ నృపసన్నిధౌ.     ౧౩
షష్టిం పుత్రసహస్రాణి సుపర్ణభగినీ తథా
మహోత్సాహాన్ కీర్తిమతో జగ్రాహ సుమతిస్సుతాన్."     ౧౪

అను నీభాగముకూడఁ గర్మమే ముఖ్యమని బోధించెను. ఎట్లనఁగా ముని మీమీయిష్టములఁ దెల్పుఁడు. వంశకరుఁడొక తనయునిగోరువా రెవ్వరు? అఱువదివేవురం గోరువా రెవ్వరు? అని ప్రశ్నించెను ఎవ రెట్లుకోరిన నట్లె కలుగుదురనికదా యామునియాశయము? ఆప్రశ్నముమీఁద నాసువతు లిద్దఱు స్వస్వకర్మానుసారముగనే కోరిరి. ఫల మట్లే కలిగెను. దీనినిబట్టి మన మాలోచింపగాఁ బ్రతిప్రాణియుఁ దనకర్మమునకుఁ దగిన ఫలము ననుభవించువాంఛనే కోరును? వంశకరుఁడగువాని నొక్కని గోరుదురా? అన్నభావమేమి? అఱువదివేవురుకొడుకులు వంశకరులు కారనికాదా యర్థము. ఆయర్థము నెఱింగియు సుమతి కోరెను. ఏల? ఆమె వంశకరులను గోరుకర్మము

జ్ఞేయ లేనని యే శివినిసారము. కావుననే కదా శ్రీకృష్ణమూర్తి "గహనా కర్మణో గతిః" అని తెటపఱచెను. లోకమున నెల్ల రును గర్మగతుల మీఱఁజాలరనియు, మీఱుదుమనుట కేవ లాహంకారమే కాని వేఱుకాదనియు మన మెఱుంగవలయు. కర్మబద్ధులము, కర్మగతుల నెఱుంగఁజాలము, కర్మముపంచినట్లు చేయువారము, అని నమ్మవలయును.

"సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం." ౫౬
(గీత ౧౮ అధ్యా.)

అన్న భగవదుక్తిని శరణముగాఁ గైకొని భగవంతు నాశ్రయింప వలయును. అనఁగాఁ గర్మఫలములను గోరక వానిని భగవంతు నకే యర్పింపవలయు ననియు, నట్లు చేసిన భగవత్ప్రసాదము కలుగుననియు, దానిచే ముక్తిదొరకుననియు, నిద్దానినుండి తేలిన సారతరాంశము. దీని నమ్మకపోయినచోఁ గర్మగతు లేమాత్రము వదలక బంధించును.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అన్న భగవదుక్తిప్రకారము ప్రకృతిబద్ధులమే యగుదుము కాని ప్రకృతికృపకుఁ బాత్రులము కాఁజాలను. కాఁబట్టి సత్క ర్మముల నాచరించుచు వానిఫలములను భగవదర్పణము చేయుచుఁ బరమేశ్వరుని నమ్మియుండిన నామహానీయుని ప్రసా దపాత్రులమగుదుమని యీభాగమునుండి మనము గ్రహింప వలయును.

"షష్టిం పుత్రసహస్రాణి సుపర్ణభగినీ తదా."

అనుభాగమున నొక్కవిశేషము కలదు సగరుని రెండవభార్య యగుసుమతి గరుత్మంతుని తోడంబుట్టువు వినతకూంతురని తేలును. ఒకతల్లికిం బక్షులు మానవులు కలిగిరని యర్థమగును. ఇది సమంజసమా? అన్నప్రశ్నము వచ్చును. సమాధాన మేమనంగా.

పూర్వసృష్టివిషయమునకు నిప్పటిసృష్టివిషయమునకు విశేషభేదము కలదు. అది హస్తిమశకన్యాయము ననుసరించును. తొలుదొలుత మానసికసృష్టి యుండెను. అనంగా సంకల్ప మాత్రమునం దనవంటిభూత మొకండు పుట్టుట. సనకసనంద నాదులు బ్రహ్మమానసపుత్రులు. అనంగా బ్రహ్మ సంకల్పించి నంతన కలిగినవారు.

"ఉత్సంగాన్నారదో జజ్ఞే దక్షోఽఙ్గుష్ఠా దితి శ్రుతిః."

అన్నసూక్తిప్రకారము బ్రహ్మతొడనుండి నారదమునియు, నంగుష్ఠమునందు దక్షుండును జనించిరి. అనంగా నాధ్యాన సమయమున నేయవయవమును జూచిన నందేయొకప్రాణి కనం బడును. దానికి మానససృష్టియని పేరు. ఆసృష్టికి మనశ్శక్తి యెక్కుడుగ నుండవలయును. కొంతకాలముకాంగా నాసృష్టి తగ్గిపోయెను. అనంగా నశించెనని యర్థముకాదు. క్వాచిత్క ముగా నది యుండెనని భావము. ఆవల నీక్షణ సృష్టికలిగెను. అనంగా దర్శనమాత్రమున సృష్టికలుగుటయని భావము. అనంగా సంకల్పము దృష్టియు రెండుండినంగాని సృష్టికాదని తాత్పర్యము. ఈసృష్టియందే వ్యాసపుత్త్రుండు శుకయోగి. ప్రభృతులు జనించినవారు. అయోనిసంభూతులనంగా నిట్టి

వారే. ఆసృష్టి కొంతకాలమునకు క్షీణించెను. అనఁగాఁ దఱచుగా లేకుండెనని యర్థము. ఆవల రేతోమాత్రసృష్టి కలిగెను. ఇందు సంకల్పము, దృష్టి యనునవి రెండు నిమిడియుండును. మనస్సు, దృష్టి, రేతస్సు, నను నీమూఁడును బని చేయవలసినవి. అనఁగా మూఁడుశక్తులును గలిసినఁగాని యొక కార్యము నెఱవేఱదని భావము. మొదటిసృష్టికిని దీనికి నెంత తారతమ్యము గలదో యోజింపుఁడు. ఈసృష్టియందుఁ గలిగిన వారు వాలిసుగ్రీవాదులు అనఁగా సంసర్గములేక కాంతారూపమును జూడఁగనే రేతస్ఖలనము కాఁగా నది యెందుఁ బడునో యద్దానినుండి యొకప్రాణి యుదయించును. ఆకాలమున నాతనిమనస్సున నేభావన యలరారునో తదనురూపముగు ప్రాణి యుదయించునని తాత్పర్యము. ద్రోణాచార్యుఁడు కలశసంభవుఁడయ్యెననుట కిదియే సిద్ధాంతము. ఈసృష్టియందు మనశ్శక్తిలేకయున్న ఫలము కలుగదు. కొంతకాలమున కీశక్తియు క్షీణించెను. ఆవల మైథునసృష్టి యారంభమయ్యెను. ఇక్కాలమునకు నాపూర్వకాలమునకుఁ గలభేద మపారము. కావున నిప్పటివారి కాకాలపుఁజర్యలు విచిత్రములుగ నసంగతములుగఁ దోఁచును. ప్రాజ్ఞుల కట్లు తోఁపవు.

ప్రకృతమున కీనియమముతోఁటిసంబంధమును గల్పింతము. కశ్యపముని వినతం బెండ్లియాడెను. అనఁగాఁ గాఁగల సృష్టికై యాతన్వి తన్ను భర్తగాఁ గోర నంగీకరించెనని భావము. వాలఖిల్యమునులయాశయము తీర్పనెంచి యింద్రుని ప్రార్థన మంగీకరించి పక్షీంద్రుని బుట్టింప నిశ్చయించెను. కావునఁ గశ్యపమునిభావన పక్షిరూపమునందే నెలకొని

యుండెను. దానిశక్తిచే నాసంతతి పక్షియే యయ్యెను. తరు
వాతిసంతతి యట్లు కావలెనన్న కోరిక యమ్మునికి నుండ నవ
సరములేదు. కావున వినతకు స్త్రీప్రజ జనించెను. ఏకగర్భసంజ
నితప్రాణులకు సహజత్వము లోకాచారరీతి నలవడినది. కావున
సుమతి యనుసగరపత్ని గరుత్మంతుని సహజాత యయ్యెను.
ఇదియే యిచ్చట సమాధానము.

కొందఱీసిద్ధాంతము నంగీకరింపమనవచ్చును. వారి
నంగీకరింపఁజేయఁ బ్రయత్నింతము. ఇక్కాలమునంగూడ
నందందు మానవజాతికి జాత్యంతరసంతతి క్వాచిత్కముగాఁ
గలుగుచుండును కాని యాప్రాణి జీవించుటలేదు. పశువు
లకుఁ దత్సమానజాతి కాక భిన్నజాతిజంతువు పుట్టుచుండును.
అదియు జీవించినట్లు వినఁబడదు. స్త్రీలకే సర్పాద్యాకారములు
గలజంతువు లుదయించుటయుఁ గలదు. ఇట్లగుటకుంగల కార
ణమేమని మన మాలోచించుటలేదు. రేతఃపతనకాలమున
వారిభావన లట్టివిగ నుండవలయును. లేకున్న నట్టిసృష్టికిఁ
గారణమే లేదు. ఈవిషయమెల్లఁ గర్మసిద్ధాంతమునే యను
సరించెడిని. వేఱుకారణము వచింపఁగాని దాని దృఢపఱుపఁ
గాని యవకాశము లేదు.

"పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. ౧౪
శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. ౧౬
యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకాన్న హంతి న నిబధ్యతే." ౧౭
(గీత ౧౮ అధ్యా.)

అన్న యీ శ్రీకృష్ణవాక్యములయందుఁ బైభావ మిమిడి యున్నది. కర్మసిద్ధాంతము నెఱుంగఁజాలని మూర్ఖుఁడు తరింపఁ జాలఁడని భగవంతుఁడు శాసించుచున్నవాఁడు. కాఁబట్టి భగవద్వాక్యములఁ దలంచియుఁ, బూర్వకాలమునఁ గలవారిమనశ్శక్తిఁ బరికించియు, నిక్కాలమున నెందో యెప్పుడో కలుగుచున్న విచిత్రసృష్టులం బరిశీలించియు, మొండిపట్టుదలలఁ బూనకయుండుఁడనియు నట్టివారిం బ్రార్థింతము. సృష్టివైచిత్ర్యము ప్రకృతిపూరుషులకుందప్ప నితరులకుఁ దెలియఁ దరముగాదని మనము నమ్ముదము.

"యతో విచిత్రా జన వస్తుశక్తయః"

అన్న భాస్కరాచార్యోక్తిం దలంచుచుఁ బైవిషయమును జర్చింప మది మరలింతము.

"స చ జ్యేష్ఠో నరశ్రేష్ఠ సగరస్యాత్మసంభవః
బాలాన్ గృహీత్వా తు జలే సరయ్వా రఘునందన. ౨౦
ప్రక్షిప్య ప్రహసన్నిత్యం మజ్జతస్తాన్ నిరీక్ష్య వై
ఏవం పాపసమాచారస్సజ్జనప్రతిబాధకః. ౨౧
పౌరాణామహితే యుక్తః పుత్రో నిర్వాసితః పురాత్"

అను నీభాగమునఁగల పూర్వాపాలకధర్మముల నెఱుంగఁ బ్రయత్నింతము.

"పితాచార్యస్సుహృన్మాతాభార్యాపుత్రః పురోహితః
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి." ३३५
మను. ८ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యము విశేషవిధియని యెఱుంగవలయును. ఏలయనఁగా,

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి." ౧౨౮. అ. ౮.

అన్నవిధి కలదుగాన దానింబట్టి యదండ్యులు కొందఱు గలరని తోఁచెడిని.

"బాలవృద్ధాతురస్త్రీణాం న దండస్తాడనం దమః"

అన్నసామాన్య వాక్యముగలదు. కొందఱు పితృపుత్త్రాదులను దండింపరాదందురు. ఆవాక్యములనెల్ల నిట నుదాహరింపఁ బూనను. వీనింబట్టి పరికించిన మనుస్మృతివాక్యము విశేషవిధి యనియే కనుపట్టెడు. పిత్రాదులు స్వధర్మమును వీడి యధర్మమునఁ బ్రవర్తించిరేని వారిని దండింపక వదలరాదన్నది విశేషవిధి కాదని యెవరందురు? ఆశాస్త్రము ననుసరించి సగరభూజాని కుమారుని ముందు రాజు కాఁబోవువాఁడని తలంచి వానివలని చెడుగులఁ బ్రజలనుభవింపకయుండఁ బాఱఁదోలెను. ప్రజాహితమే ప్రభుధర్మమను నీతిని స్వప్రవృత్తిచేఁ దేటపఱచెను. అట్టికాలమున ధర్మము సంపూర్ణాకృతిం దాల్చియుండు ననుటకు సంశయముండునా?

"శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమాం,
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్." ౨

అన్నభాగమున నొక్కవిశేషార్థము విశేషముకూడఁ గలదు. సగరచక్రవర్తి యజ్ఞముచేయఁబూనెనని ముని పలుకఁగా రామచంద్రుఁడు నే నీకథను వినఁగోరెదనని యడుగుచు నీకు మంగళమగుంగాక యనియె. ఇది ముని కాశీర్వాదమనియుఁ, దాను బరమేశ్వరుఁడగుట ముని నాశీర్వదించుట యుక్తమే యనియుఁ గొందఱందురు. కాని యది సమంజసము కాదు. వాల్మీకికృత రామాయణమహాకావ్యమున "భద్రం తే" అను వాక్యము పెక్కుతావులఁ గలదు. కొన్నితావుల నసంగతముగ నది దోఁచును. ఇచ్చోటమాత్రము మంచియర్థము దానికిం గలదు. మాపూర్వచరిత్రమును దెలుపుము. అందేదే నమంగళ వాక్కు వినఁబడిన నేనేమే మదిఁ గుందుదునో యని సందియ మందకుము. దుఃఖించి నీకార్యమున కించుకంతయు భంగము గల్గింపను. నీకు మేలగుంగాక యని రామునిభావ మని మనము గ్రహించిన మనకును భద్రమే కలుగును.

విశేషమేమనఁగా నాపూర్వుఁడగు సగరమహీపతీంద్రుఁ డెట్లు యజ్ఞమొనరించెనో విస్తరించి చెప్పుమా యని రామ మూర్తి ప్రశ్నించెను. లోకమునఁ బ్రతిమానవునకును దనకుల మున నభిమానముండుట సహజము. అది కల్పించుకొన్నది కాదు నైసర్గికము. మానవజాతి కయ్యది స్వభావసిద్ధము. సర్వ మానవసోదరత్వమనునది కొనితెచ్చిపెట్టుకొన్న యది. సహజము కాదు. సాధ్యమగునదియుఁ గానిది. దీనింబట్టి కులాభిమానము ప్రాచీనముకాని నవీనముగాదని యెఱుంగఁబడును. రామ చంద్రునకే కలిగినపుడు సామాన్యజనుల కయ్యది కలుగుట వింతగాదు. కులాభిమానము ప్రాచీనమనియు, దాని నిర్మూలింప

బూనుట యవివేకముచేతనే యనియు మన మెఱుంగవలయును.

"విశ్వామిత్రస్తు కాకుత్స్థముపాచ ప్రహసన్నివ."

"ప్రహసన్నివ, ప్రసన్నవదన ఇత్యర్థః. స్వవివక్షితస్యైవ పృష్టత్వాత్ ప్రహాసః." అని గోవిందరాజులు. "అత్ర చ కారణం స్వవివక్షితమేవ సగరయాగవృత్తాంతం స్వపూర్వజవృత్తాంతతయా శ్రవణకుతూహలాతిశయేన పృష్టవాన్ రామభద్ర ఇతి." అని మహేశ్వరతీర్థులు.

ఈఘట్టమున నాంధ్ర మొనరించినవా రెట్లు భావములం దెలిపిరని యించుక పరిశీలింతము. తొలుత మూలము నించుక పరిశీలింపుఁడు.

"స కృత్వా నిశ్చయం రామ సోపాధ్యాయగణస్తదా,
యజ్ఞకర్మణి వేదజ్ఞో యష్టుం సముపచక్రమే.

ఇది ముప్పదియెనిమిదవ సర్గాంతశ్లోకము.

విశ్వామిత్రవచశ్శ్రుత్వా కథాంతే రఘునందనః,
ఉవాచ పరమప్రీతో మునిం దీప్తమివానలం. ౧
శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమాం,
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్. ౨
శంకరశ్వశురో నామ హిమవానచలోత్తమః,
వింధ్యపర్వతమాసాద్య నిరీక్షేతే పరస్పరం." ౩

అని మూలము.

క. "అతనిసుతుఁ డంశుమంతుఁడు
ఋతవాదియు సర్వలోకహితుఁ డై వెలసెన్
మతియొదవె సగరునకుఁ దాఁ
గ్రతు వొకఁటి సేయ దానికై పనిపూనెన్.

